ప. వి. సర్వస్వం-చేతసః - తాం. నృపతిః - అపి - దృశే - ప్రీతిదాయం-ప్రదాయ - ప్రాపత్ - తద్దృష్టిమిష్టాతిథిమ్-అమరదురాపామ్ - అపాఙ్గోత్తరఙ్గామ్ - అనన్దాన్ధ్యేన - వన్ధ్యాన్-అకృత-తదపరాకూతపాతాన్-సః-రత్యాః-పత్యా - పీయూషధారావలనవిరచితేన-ఆశుగేన-ఆశు - లీఢః.

అర్థము. నృపతిరపి=సత్యనలుడును, చేతసః=మనస్సునకు, సర్వస్వం=సర్వధనమైన యనగా (మనస్సునుండి తొలగిపోనట్టి) తాం=ఆదమయన్తిని, దృశే=తనదృష్టికి, ప్రీతిదాయం = పారితోషికదానముగా, ప్రదాయ = ఇచ్చి (తొలుత నిరంతరము నామెను ధ్యానించుటచేత మనస్సుచే నామె ప్రత్యక్షముగావించుకొనఁ బడినది. ఇప్పుడో నేత్రములతో నామెను ప్రత్యక్షముగావించుకొనెను) అమరదురాపాం = దేవతలకును దుర్లభమైనట్టి, అపాఙ్గోత్తరఙ్గామ్ ; అపాఙ్గ=కడకన్నులచే, ఉత్తరఙ్గామ్=తరంగములతో గూడినదైన, తద్దృష్టిం ; తత్=ఆదమయన్తియొక్క, దృష్టిం = చూపనెడి, ఇష్టాతిథిం=ప్రియమైన అతిథిని, ప్రాపత్=పొందెను. అథ=పిదప, సః=ఆరాజు, రత్యాః = రతియొక్క, పత్యా = భర్తయైనమన్మథునిచే, పీయూషధారావలనవిరచితేన ; పీయూషధారా = అమృతధారయొక్క, వలన=స్రావముచే, విరచితేన=నిర్మింపఁ బడిన. ఆశుగేన = బాణముచే, (దమయన్తికటాక్షమను బాణముచే) ఆశు = శీఘ్రముగా, లీఢస్సన్ = కొట్టఁ బడినవాఁడై, ఆనన్దాన్ధ్యేన; ఆనంద =ఆనందమువలని, ఆన్ధ్యేన=మోహముచేత, తదపరాకూతపాతాన్; తత్=ఆదమయన్తిప్రథమదృష్టికి, అపరాన్ = తర్వాతివియగు, ఆకూతపాతాన్ = ప్రేమతోగూడిన దృష్టిపాతములను, వన్ధ్యాన్ = వ్యర్థములైనవిగా, అకృత = చేసెను, మొదటిచూపుతనపైఁ బడుటవలనఁ గల్గిన యానందమునమునిగినవాడై తర్వాత నామెయొక్క సాభిప్రాయములైన దృష్టిపాతములను, జూడ లేదనియర్థము.

**సమాసములు :**

ప్రీతిదాయం :- ప్రీత్యాదాయః = ప్రీతిదాయః, తమ్ = ప్రీతిదాయం.

తద్దృష్టిమ్ :- తస్యాః దృష్టిః = తద్దృష్టిః, తామ్ = తద్దృష్టిమ్.

ఇష్టాతిథిమ్ :- ఇష్టశ్చాసౌ అతిథిశ్చ = ఇష్టాతిథిః, తమ్ = ఇష్టాతిథిమ్.

అమరదురాపామ్:- దుఃఖేన ఆప్తుం శక్యా=దురాపా, అమరైః దురాపా= అమరదురాపా, తాం అమరదురాపా, తామ్ = అమరదురాపామ్.

అపాఙ్గోత్తరఙ్గామ్ :- అపాఙ్గైః ఉత్తరఙ్గా = అపాఙ్గోత్తరఙ్గా, తామ్ = అపాఙ్గోత్తరఙ్గామ్.

అనన్ధాన్ధ్యేన :- అన్ధస్యభావః=ఆన్ధ్యమ్, అనన్దేన ఆన్ధ్యమ్=అనన్ధాన్ధ్యం, తేన = అనన్ధాన్ధ్యేన.

తదపరాకూతపాతాన్ :- తస్యాః అపరాః = తతదపరాః, ఆకూతేన పాతాః=ఆకూతపాతాః, తదపరాశ్చతే ఆకూతపాతాశ్చ = తదపరాకూత పాతాః, తాన్ = తదపరాకూతపాతాన్.

పీయూషధారావలనవిరచితేన :- పీయూషస్యధారా = పీయూషధారా, పీయూషధారాయాః వలనం = పీయూషధారావలనమ్. పీయూషధారా వలనేన, విరచితః = పీయూషధారావలన విరచితః, తేన = పీయూష ధారావలనవిరచితేన.

**భావము :**

నిజమైన నలుఁడు హృదయమును వీడనట్టి యా దమయన్తిని తన దృష్టికి పారితోషికముగా నొసంగి యనగా పూర్వము మనస్సుచేతను, ఇప్పుడు నేత్రముల తోఁడనుఁ బ్రత్యక్షముఁ గావించుకొనెను. పిదప నతడు తన దృష్టికి, దేవతలకును; దుర్లభమైనట్టి, కటాక్షములతో తరంగితమగు నామె దృష్టిని ప్రియమైన యతిథినిఁ గావించుకొనెను. ఇట్లు ఆమె దృష్టియను, నమృత ధారచే బూయఁబడిన బాణముతో, మన్మథునిచేఁ గొట్టబడి యానందముచే నంధుఁడై, తర్వాత నామె ప్రసరింపఁజేసిన సాభిప్రాయములును, సాభిలాషములునగు దృష్టి పాతములను వ్యర్థములనుఁ గావించెను. మొదటి దృష్టి పాతముచే నతడానంద మున మునుగుట వలన తర్వాతి దృష్టి పాతములను జూడఁజాల నందు వలన నవి వ్యర్థములైనవని యాశయము ॥౧౧౨॥

శ్లో. శ్రీహర్షం కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః సుతం
శ్రీహీరః సుషువే జితేన్ద్రియచయం మామల్లదేవీ చయం।
**తస్య ద్వాదశ ఏషమాతృచరణామ్భోజాలమౌలేర్మహా
కావ్యేఽయం వ్యగలన్నలస్య చరితే సర్గో నిసర్గోజ్జ్వలః॥**

ప. వి. శ్రీహర్షం— కవిరాజరాజిముకుటాలఙ్కారహీరః - సుతం - శ్రీహీరః - సుషువే- జితేన్ద్రియచయం- మామల్లదేవీచ— యం- తస్య - ద్వాదశః- ఏషః- మాతృచరణామ్భోజాలిమౌలేః- మహాకావ్యే—అయం—వ్యగలత్— నలస్య-చరితే-సర్గః—నిసర్గోజ్జ్వలః.



అర్థము. కవిరాజ రాజిమకుటాలఙ్కార హీరః, కవిరాజ=కవిశ్రేష్ఠుల, రాజి= వరుసయొక్క మకుట=కిరీటమండలి, అలఙ్కార=అలఙ్కారములగు రత్నములలో, హీరః=వజ్రమణియగు, శ్రీహీరః=శ్రీహీరుఁడను మహా కవి, జితేన్ద్రియచయం, జిత=జయింపఁబడిన, ఇన్ద్రియ=ఇన్ద్రియముల యొక్క, చయం = సమూహము గల్గిన, హర్షం=శ్రీహర్ష మహాకవిని, సుషువే = కనెనో, మామల్లదేవీచ = మామల్లదేవియు, యం=ఎవనిని, సుషువే=కనెనో, మాతృచరణామ్భోజాలిమౌలేః, మాతృచరణ = తల్లి పాదములనెడి, అమ్భోజ=తామరపూవులకు, అలి=తుమ్మెదలుగా నాచ రించు, మౌలేః=శిరముగల్గిన, తస్య=అశ్రీహర్షునియొక్క కృతియగు, మహాకావ్యే=మహాకావ్యమైన, నలస్య=నలునియొక్క, చరితే=చరిత్రము నందు, నిసర్గోజ్జ్వలః = స్వభావముచే ప్రకాశమానమగు, ఏషః = ఈ, ద్వాదశః=పంద్రెండవ, సర్గః=సర్గ, అయంవ్యగలత్=ఇదిగో పూర్తి యైనది.



**సమాసములు :**

కవిరాజరాజిమకుటాలఙ్కార హీరః :— కవీనాం రాజానః=కవిరాజాః, కవిరాజానాం రాజిః=కవిరాజరాజిః, కవిరాజ రాజేః మకుటం=కవిరాజ రాజి మకుటం, కవిరాజరాజి మకుటస్య అలఙ్కారాః = కవిరాజరాజి మకుటాలఙ్కారాః, కవిరాజరాజి మకుటాలఙ్కారేషు హీరః = కవిరాజ రాజి మకుటాలఙ్కారహీరః।

జితేన్ద్రియచయం :— ఇన్ద్రియాణాంచయః = ఇన్ద్రియచయః, జితః ఇన్ద్రియచయః యేనసః = జితేన్ద్రియచయః, తమ్=జితేన్ద్రియచయమ్. మాతృచరణామ్భో జాలిమౌలేః :— మాతుః చరణౌ = మాతృచరణౌ. మాతృచరణావేవ, అమ్భోజే=మాతృచరణామ్భోజే, మాతృచరణామో

జయోః అలిః :- మాతృచరణామ్భోజాలిః, మాతృచరణామ్భోజాలి రేవ మౌలిః యస్యసః=మాతృచరణామ్భో జాలిమౌలిః, తస్య=మాతృచరణామ్భో జాలిమౌలేః।

నిసర్గోజ్జ్వలః :- నిసర్గేణ ఉజ్జ్వలః=నిసర్గోజ్జ్వలః.

**భావము :**

కవిశ్రేష్ఠుల పంక్తియొక్క కిరీటాలంకారమణులలో వజ్రమణియగు శ్రీహీరకవియు, మామల్లదేవియు శ్రీహర్షకవినిఁ గనిరి. తల్లిపాదములనెడి తామరపూవులకుఁ తుమ్మెదవలె నాచరించు శిరముగల్గిన యాశ్రీహర్షుఁడు రచియించిన మహాకావ్యమగు నలచరిత్రమునందుఁ బండ్రెండవ సర్గ పరిసమాప్తము ॥౧౧౩॥

ఇట్లు
శ్రీమదాత్రేయగోత్రోద్భవ ఉడాలినరసింహసూరి
తనూజసుబ్బరామశాస్త్రి విరచితమగు
శ్రీహర్షనైషధ వ్యాఖ్యయందు
ద్వాదశసర్గ సమాప్తము
ఓం
శమ్